# అథ షష్ఠో%ధ్యాయః

# శివ తత్త్వ జ్ఞానము

మునయ ఊచుః |

యో%యం పశురితి ప్రోక్తో యశ్చ పాశ ఉదాహృతః | అభ్యాం విలక్షణః కశ్చిత్కో % యమస్తి తయోఃపతిః || 1

మునులు ఇట్లు పలికిరి -

పశువు మరియు పాశము అనునవి చెప్పబడినవి. ఈ రెండింటికీ ప్రభువు మరియు వీటికంటె విలక్షణమైనవాడు అగు పురుషుడు ఎట్టివాడు? (1)

వాయురువాచ |

అస్తి కశ్చిదపర్యంతరమణీయగుణాశ్రయః | పతిర్విశ్వస్య నిర్మాతా పశుపాశవిమోచనః || 2

అభావే తస్య విశ్వస్య సృష్టిరేషా కథం భ##వేత్ | అచేతనత్వాదజ్ఞానాదనయోః పశుపాశయోః || 3

ప్రధానపరమాణ్వాది యావత్కించిదచేతనమ్ | తత్కర్తృకం స్వయం దృష్టం బుద్ధిమత్కారణం వినా || 4

జగచ్చ కర్తృసాపేక్షం కార్యం సావయవం యతః | తస్మాత్కార్యస్య కర్తృత్వం పత్యుర్న పశుపాశయోః || 5

పశోరపి చ కర్తృత్వం పత్యుః ప్రేరణపూర్వకమ్ | అయథాకరణజ్ఞానమంధస్య గమనం యథా || 6

ఆత్మానం చ పృథజ్ మత్వా ప్రేరితారం తతః పృథక్ | అసౌ జుష్టస్తతస్తేన హ్యమృతత్వాయ కల్పతే || 7

పశోః పాశస్య పత్యుశ్చ తత్త్వతో%స్తి పదం పరమ్ |
బ్రహ్మవిత్తద్విదిత్వైవ యోనిముక్తో భవిష్యతి || 8

సంయుక్తమేతద్ద్వితయం క్షరమక్షరమేవ చ | వ్యక్తావ్యక్తం బిభర్తీశో విశ్వం విశ్వవిమోచకః || 9

భోక్తా భోగ్యం ప్రేరయితా మంతవ్యం త్రివిధం స్మృతమ్ | నాతః పరం విజానద్భిర్వేదితవ్యం హి కించన|| 10

వాయువు ఇట్లు పలికెను -

అనంతసుందరగుణములకు ఆశ్రయమైనవాడు, జగత్తును నిర్మించినవాడు, జీవుల సంసారబంధమును విడిపించువాడు అగు ప్రభుడు ఒకానొకడు కలడు (2). జీవుడు అజ్ఞాని ; పాశము జడము. కావున, ఆయనయే లేనిచో, ఈ సృష్టి ఎట్లు సంభవమయ్యేడిది? (3) ప్రధానము, పరమాణువులు మొదలగు జడవస్తువులను జగద్రూపముగా మలిచిన కర్త ఆ పరమేశ్వరుడేనని సుస్పష్టమగుచున్నది. చేతన కారణము లేనిదే వీటి పుట్టుక ఎట్లు సంభవమగును ? (4). జగత్తు అవయవములు గలది, మరియు కార్యము, కావున దానికి కర్త ఉండి తీరవలెను. కావున, కార్యజగత్తుయొక్క కర్త శివప్రభుడే గాని, పశుపాశములు కావు (5). జీవునియందు గల కర్తృత్వము శివప్రభుని ప్రేరణ వలన మాత్రమే సంభవమగుచున్నది. గుడ్డివాని నడక వలె జీవుని ఇంద్రియములు యథార్థ జ్ఞానమును ఈయజాలవు (6). ఆరంభములో తనను వేరుగా మరియు ప్రేరకుడుగు పరమేశ్వరుని వేరుగా తలంచిననూ, తరువాత జీవుడు ఈశ్వరునితో గల తన స్వరూపమునకు గల అభేదమును గుర్తించి మోక్షమునకు అర్హుడగును (7). శివప్రభుని పరమపదము పశుపాశముల స్వరూపమే యగుచున్నది. దానిని తెలుసుకున్న బ్రహ్మవేత్త మరల జన్మను పొందదు (8). ఈ క్షర- అక్షరతత్త్వముల రెండింటి కలయికను, అవ్యక్తము (ప్రకృతి) ను మరియు దానినుండి వ్యక్తమయ్యే జగత్తును ఈశ్వరుడే నిలబెట్టుచున్నాడు. ఆయనయే జీవునకు సంసారమునుండి మోక్షమునిచ్చును (9). భోక్త

(కర్మఫలముల ననుభవించు జీవుడు), భోగ్యము (ప్రకృతి) మరియు ప్రేరకుడు (ఈశ్వరుడు) అనే మూడు తత్త్వములు మాత్రమే గలవని మహర్షులు వర్ణించుచున్నారు. జిజ్ఞాసువులు ఇంతకు మించి తెలియ దగినది ఏదియూ లేదు (10).

తిలేషు వా యథా తైలం దధ్ని వా సర్పిరర్పితమ్ | యథాపస్స్రోతసి వ్యాప్తా యథారణ్యాం హుతాశనః || 11

ఏవమేవ మహాత్మానమాత్మన్యాత్మ విలక్షణమ్ | సత్యేన తపసా చైవ నిత్యయుక్తో%ను పశ్యతి || 12

య ఏకో జాలవానీశ ఈశానీభిస్స్వశక్తిభిః | సర్వాంల్లోకానిమాన్ కృత్వా ఏక ఏవ స ఈశ##తే || 13

ఏక ఏవ సదా రుద్రో న ద్వితీయో%స్తి కశ్చన | సంసృజ్య విశ్వభువనం గోప్తాంతే సంచుకోచ యః || 14

విశ్వతశ్చక్షురేవాయముతాయం విశ్వతోముఖః | తథైవ విశ్వతోబాహుర్విశ్వతః పాదసంయుతః || 15

ద్యావాభూమీ చ జనయన్ దేవ ఏకో మహేశ్వరః | స ఏవ సర్వదేవానాం ప్రభవశ్చోద్భవస్తథా || 16

హిరణ్యగర్భం దేవానాం ప్రథమం జనయేదయమ్ | విశ్వస్మాదధికో రుద్రో మహర్షిరితి హి శ్రుతిః || 17

వేదాహమేతం పురుషం మహాంతమమృతం ధ్రువమ్ | ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్సంస్థితం ప్రభుమ్ || 18

అస్మాన్నాస్తి పరం కించిదపరం పరమాత్మనః | నాణియో % స్తి న చ జ్యాయస్తేన పూర్ణమిదం జగత్ || 19

సర్వాననశిరోగ్రీవస్సర్వభూతగుహాశయః | సర్వవ్యాపీ చ భగవాంస్తస్మాత్సర్వగతశ్శివః || 20

సర్వతః పాణిపాదోऽయం సర్వతోऽక్షిశిరోముఖః | సర్వతః
శ్రుతిమాంల్లోకే సర్వమావృత్య తిష్ఠతి || 21

నిత్యము సత్యమును పాటిస్తూ తపస్సును చేయు యోగి శాస్త్రో పదేశమును పొంది నువ్వులలో నూనె వలె, పెరుగులో నేయి వలె, నదీప్రవాహములో నీరు వలె, మరియు అరణి (నిప్పును మథించే చెక్క) లో అగ్నివలె, బుద్ధియందు బ్రహ్మ- అభిన్నము మరియు దేహాదుల కంటె విలక్షణము అగు ఆత్మను దర్శించును (11,12). అద్వితీయుడు, మాయావి అగు పరమాత్మ సర్వసమర్థములగు తన శక్తులతో కూడినవాడై, ఈ సకలలోకములను సృష్టించి, తాను దానియందు జన్మించి (ప్రవేశించి), తాను ఒక్కడే సర్వమును పాలించుచున్నాడు (13). సర్వకాలములలో ఒకే ఒక రుద్రుడు గలడు. రెండవవాడు ఎవ్వడైననూ లేడు. ఆయనయే సకలలోకములను సృష్టించి రక్షించిప్రళయకాలమునందు సంహరించుచున్నాడు (14). ఈ జగత్తులోని కన్నులు, ముఖములు, చేతులు మరియు కాళ్లు సర్వము ఆయనకు సంబంధించినవియే (15). అద్వితీయుడగు మహేశ్వరుడు భూలోక, స్వర్గలోకములను సృష్టించినాడు. సకలదేవతలు ఆయననుండి పుట్టి ఆయనలో లీనమగుదురు (16). దేవతలలో మొదటివాడగు హిరణ్యగర్భుని ఆయనయే సృష్టించుచున్నాడు. సర్వజ్ఞుడగు రుద్రుడు సర్వులకంటె అధికుడని వేదము వర్ణించుచున్నది (17). చేతనస్వరూపుడు, సర్వముకంటె పెద్దవాడు, అవినాశి, అవికారి, ఆదిత్యుని వలె ప్రకాశించువాడు, అజ్ఞానమును ప్రకాశింపజేస్తూ దానికి అతీతుడై యుండువాడు అగు ఈ శివప్రభుని నేను తెలుసుకున్నాను (18). ఈ పరమాత్మ కంటె గొప్పది గాని, తక్కువది గాని మరియొకటి లేదు. ఈయన కంటె చిన్నది గాని, పెద్దది గాని లేదు. ఈ జగత్తు ఆయనచే వ్యాప్తమై యున్నది (19). ముఖములు, తలలు మరియు మెడలు అన్నీ ఆయనవియే. సర్వప్రాణుల బుద్ధి అనే గుహలో ఆయనయే నివాసమున్నాడు. ఈ శివభగవానుడు సర్వమునందు కారణరూపముగా అనువృత్తుడై సర్వమును వ్యాపించి యున్నాడు

(20). ఈ సృష్టిలోని చేతులు, కాళ్లు, కన్నులు, తలలు, ముఖములు, చెవులు అన్నీ ఆయనవియే. ఆయనయే సర్వమును వ్యాపించియున్నాడు (21).

సర్వేంద్రియగుణాభాసస్సర్వేంద్రియవివర్జితః | సర్వస్య ప్రభురీశానస్సర్వస్య శరణం సుహృత్ || 22

అచక్షురపి యః పశ్యత్యకర్ణో%పి శృణోతి యః | సర్వం వేత్తి న వేత్తా%స్య తమాహుః పురుషం పరమ్ || 23

అణోరణీయాన్మహతోమహీయానయమవ్యయః | గుహాయాం నిహితశ్చాపి జంతోరస్య మహేశ్వరః || 24

తమక్రతుం క్రతుప్రాయం మహిమాతిశయాన్వితమ్ | ధాతు ప్రసాదాదీశానం వీతశోకః ప్రపశ్యతి || 25

వేదాహమేనమజరం పురాణం సర్వగం విభుమ్ | నిరోధం జన్మనో యస్య వదంతి బ్రహ్మవాదినః || 26

ఏకో%పి త్రీనిమాంల్లోకాన్ బహుధా శక్తియోగతః | విదధాతి విచేత్యంతే విశ్వమాదౌ మహేశ్వరః || 27

విశ్వధాత్రీత్యజాఖ్యా చశైవీ చిత్రాకృతిః పరా | తామజాం లోహితాం శుక్లాం కృష్ణామేకాం త్వజః ప్రజామ్ || 28

జనిత్రీమనుశేతే % న్యో జుషమాణస్స్వరూపిణీమ్ | తామేవాజామజో%న్యస్తు భుక్తభోగాం జహాతి చ || 29

ద్వాసుపర్ణౌ సయుజౌ సమానం వృక్షమాస్థితౌ | ఏకో%త్తి పిప్పలం స్వాదు పరో%నశ్నన్ ప్రపశ్యతి || 30

వృక్షే% స్మిన్ పురుషో మగ్నో ముహ్యమానశ్చ శోచతి | జుష్టమన్యం యదా పశ్యేదీశం పరమకారణమ్ || 31

తదాస్య మహిమానం చ వీతశోకస్సుఖీ భ##వేత్ | ఛందాంసి యజ్ఞాః క్రతవో యద్భూతం భవ్యమేవ చ || 32

మాయావిశ్వం సృజత్యస్మిన్నివిష్టో మాయయా పరః | మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ || 33

ఇంద్రియవ్యాపారములన్నింటిలో పరమేశ్వరుడే చైతన్యస్వరూపుడై యున్నాడు. కాని, ఆయనకు ఇంద్రియావ్యాపారములతో సంపర్కము లేదు. సర్వజగత్తునకు ప్రభువు అగు ఈశ్వరుడు సర్వులకు శరణునిచ్చే చక్కని హృదయము గల మిత్రుడు (22). ఆయన కన్నులు లేకుండగనే చూచును. చెవులు లేకుండగనే వినును. ఆయన సర్వమును తెలుసుకొనును. కాని ఆయనను తెలిసినవాడు లేడు. ఆయన పరమపురుషుడని మహర్షులు వర్ణించుచున్నారు (23). అవినాశియగు ఆ పరమాత్మ అణువు (మిక్కిలి చిన్నది) కంటె చిన్నవాడు. కాని, మిక్కిలి పెద్దదానికంటె పెద్దవాడు. మహేశ్వరుడు ఈ ప్రాణుల బుద్ధి అనే గుహలో దాగి యున్నాడు (24). సంకల్పములు లేనివాడు, కాని సంకల్పముల రూపములో ప్రకటమగువాడు, అతిశయించిన మహిమ గలవాడు అగు ఆ ఈశ్వరుని, శరీరములోని ఇంద్రియముల పాటవము అనే అనుగ్రహముచే తెలుసుకొని మానవుడు శోకమునుండి విముక్తిని పొందును (25). ఏ పరమేశ్వరునకు జన్మలేదని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారో, అట్టి ముసలిదనము లేని, సనాతనుడు సర్వమునందు కారణరూపముగా అన్వయించువాడు మరియు సర్వవ్యాపకుడు అగు ఈ ఈశ్వరుని నేను తెలుసుకొంటిని (26). మహేశ్వరుడు అద్వితీయుడే అయిననూ, శక్తితో కూడినవాడై, ఈ ముల్లోకములలోని అనేకరూపములతో గూడిన బ్రహ్మాండమును సృష్ట్యాదియందు నిర్మించి, ప్రళయకాలమునందు తనలోనికి ఉపసంహరించుచున్నాడు (27). వివిధరూపములలో ప్రకటము కాగలది, జగన్మాత, అజ (పుట్టుక లేనిది) అను పేరు గలది అగు శివుని పరా (సర్వకారణము) శక్తి జగత్తునకు ఉపాదానకారణమగుచున్నది. ఎరుపు (అగ్ని), తెలుపు(జలము),

నలుపు(పృథివి) రంగులు గలది, స్వయముగా పుట్టుక లేనిది అగు ఆ మాయాశక్తి మహత్తు మొదలైన వివిధతత్త్వముల రూపములోనికి పరిణమించుచున్నది. అజుడగు జీవుడు అట్టి జగత్తునందుప్రీతి గలవాడై అజ్ఞానముచే దానితో తాదాత్మ్యమును పొంది సంసారి యగుచున్నాడు. కాని, శబ్దాదివిషయగ్రహణరూపములో భోగ్యము అగుచున్న ఆ మాయకు అతీతుడై, అజుడగు పరమేశ్వరుడు చైతన్యస్వరూపమునందు పరినిష్ఠితుడై యున్నాడు (28, 29). జీవుడు మరియు ఈశ్వరుడు అనే రెండు పక్షులు ఒకే సంసారమనే చెట్టును ఆశ్రయించుకొని కలిసి మెలిసి జీవించుచున్నవి. వాటిలో ఒకటి (జీవుడు) కర్మఫలము అనే పండును భక్షించుచుండగా, రెండవ పక్షి (ఈశ్వరుడు) దేనినీ తినకుండగా సాక్షియై చూచుచున్నాడు (30). మోహముచే ఈ సంసారవృక్షమునందు నిమగ్నమై యున్న జీవుడు దుఃఖించుచున్నాడు. కాని, ఆ జీవుడు అదే వృక్షమును ఆశ్రయించి ఉన్న సర్వకారణకారణమగు ఈశ్వరుని ఏనాడు కనుగొనునో, ఆయన మహిమను గుర్తించునో, ఆనాడు ఆతడు శోకము నుండి విముక్తుడై సుఖమును పొందును. వేదములు, వివిధములగు ఆరాధనలు, యాగములు, భూతకాలమునందలి సర్వము మరియు భవిష్యత్కాలములోని సర్వము కూడ ఆ మాయావిచే రచింపబడుచున్నది. పరమాత్మ మాయను వశము చేసుకొని జగత్తును సృష్టించి దానియందు ప్రవేశించి యున్నాడు. జగత్తుయొక్క ఉపాదానకారణము మాయ అనియు, మాయను ఈశ్వరుడు తన వశములో నుంచుకొనుననియు తెలియవలెను (31-33).

తస్యాస్త్వవయవైరేవ వ్యాప్తం సర్వమిదం జగత్ |
సూక్ష్మాతిసూక్ష్మమీశానం కలలస్యాపి మధ్యతః || 34

స్రష్టారమపి విశ్వస్య వేష్టితారం చ తస్య తు | శివమేవేశ్వరం జ్ఞాత్వా శాంతిమత్యంతమృచ్ఛతి || 35

స ఏవ కాలో గోప్తా చ విశ్వస్యాధిపతిః ప్రభుః | తం విశ్వాధిపతిం జ్ఞాత్వా మృత్యుపాశాత్ర్ప ముచ్యతే || 36

ఘృతాత్పరం మండమివ సూక్ష్మం జ్ఞాత్వా స్థితం ప్రభుమ్ | సర్వభూతేషు గూఢం చ సర్వపాపైః ప్రముచ్యతే || 37

ఏష ఏవ పరో దేవో విశ్వకర్మా మహేశ్వరః | హృదయే సంనివిష్టం తం జ్ఞాత్రై వామృతమశ్నుతే || 38

యదా సమస్తం న దివా న రాత్రిర్న సదప్యసత్ | కేవలశ్శివ ఏవైకో యతః ప్రజ్ఞాపురాతనీ || 39

నైనమూర్ధ్వం న తిర్యక్చ న మధ్యం పర్యజిగ్రహత్ | న తస్య ప్రతిమా చాస్తి యస్య నామ మహద్యశః || 40

అజాతమిమమేవైకే బుద్ధ్వా జన్మని భీరవః | రుద్రస్యాస్య ప్రపద్యంతే రక్షార్థం దక్షిణం ముఖమ్ || 41

ద్వే అక్షరే బ్రహ్మపరే త్వనంతే సముదాహృతే | విద్యావిద్యే సమాఖ్యాతే నిహితే యత్ర గూఢవత్ || 42

క్షరం త్వవిద్యా హ్యామృతం విద్యేతి పరిగీయతే | తే ఉభే ఈశ##తే యస్తు సో%న్యః ఖలు మహేశ్వరః || 43

ఈ జగత్తు అంతయు ఆ ప్రకృతి యొక్క అవయవములచే మాత్రమే వ్యాప్తమై యున్నది. సూక్ష్మమైనవాటి కంటె కూడ సూక్ష్మమైనవాడు, పరిపాలకుడు, తల్లి గర్భములోని పిండమునందు కూడ చైతన్యరూపముగా ప్రకటమగువాడు, జగత్తును సృష్టించి దానిని ఆవరించి యున్న వాడు, మంగళకరుడు అగు ఈశ్వరుని తెలుసుకున్న మానవుడ అత్యంతికమగు (మోక్షరూపమైన) శాంతిని పొందును (34, 35). జగత్తునకు అధిపతి, సర్వసమర్థుడు అగు ఆ ఈశ్వరుడే కాలస్వరూపుడై రక్షించుచున్నాడు. ఆ జగన్నాథుని తెలుసుకున్న వ్యక్తి మృత్యువు అనే పాశమునుండి విముక్తిని

పొందును (36). నెయ్యికి వెన్న వలె జగత్తునకు కారణమై దాని కంటె సూక్ష్మరూపములో సర్వప్రాణులలో రహస్యముగా చైతన్యరూపుడై ఉండే ఆ ఈశ్వరుని తెలుసుకున్న వ్యక్తి పాపములన్నింటినుండియు విముక్తుడగును (37). జగత్తును సృష్టించిన దేవాధిదేవుడు అగు ఈ మహేశ్వరుడు హృదయములో చాల దగ్గరగా నున్నాడు. ఆయనను తెలుసుకున్నప్పుడు మాత్రమే మానవుడు మోక్షమును పొందును (38). ఈ సర్వజగత్తు ఏకాలములో లేదో, సత్తు (ఉనికి గలది) గాని, అసత్తు (లేనిది) గాని కాదో, ఏ కాలములో రాత్రింబగళ్లు లేవో, అప్పుడు కేవలుడగు శివుడు మాత్రమే ఉండెను. ఆయననుండియే సనాతనమగు జ్ఞానము పుట్టినది (39). ఆయనను పైన గాని, అడ్డముగా గాని, మధ్యలో గాని ఎవ్వరైననూ పట్టుకొనలేరు. ఆయనకు సాటి లేదు. ఆయన పేరు గొప్ప కీర్తిని కలిగియున్నది (40). ఎవరో కొద్దిమంది మరల జన్మవలన భయపడినవారై పుట్టుక లేక ఈ ఈశ్వరుని తెలుసుకొని, రక్షణ కొరకై ఈ రుద్రుని దక్షిణముఖమును (దక్షిణామూర్తిని) శరణు వేడెదరు (41). అవినాశి, అనంతము అగు పరంబ్రహ్మయందు విద్య (జ్ఞానము) మరియు అవిద్య (కర్మ) అనే రెండు, రహస్యములు యన్నట్లు నిక్షిప్తములై యుండునని మహర్షులు చెప్పుచున్నారు (42). అవిద్య వినాశి (క్షరము) అనియు, విద్య అమృతము (మోక్షము) అనియు కీర్తించబడినది. ఆ రెండింటినీ పాలించే మహేశ్వరుడు వాటికంటె అతీతుడు (43).

ఏకైకం బహుధా జాలం వికుర్వన్నేకవచ్చ యః | సర్వాధిపత్యం
కురుతే సృష్ట్వా సర్వాన్ ప్రతాపవాన్ || 44

దిశ ఊర్ధ్వమధస్తిర్యగ్ భాసయన్ భ్రాజతే స్వయమ్ |
యోనిస్స్వభావాదప్యేకో వరేణ్యస్తధితిష్ఠతి || 45

స్వభావవాచకాన్ సర్వాన్ వాచ్యాంశ్చ పరిణామయన్ | గుణాంశ్చ
భోగ్యభోక్తృత్వే తద్విశ్వమధితిష్ఠతి || 46

తే వై గుహ్యోపనిషది గూఢం బ్రహ్మ పరాత్పరమ్ | బ్రహ్మయోనిం
జగత్పూర్వం విదుర్దేవా మహర్షయః || 47

భావగ్రాహ్యమనీహాఖ్యం భావాభావకరం శివమ్ | కలాసర్గకరం దేవం యే విదుస్తే జహుస్తమమ్ || 48

స్వభావమేకే మన్యంతే కాలమేకే విమోహితాః | దేవస్య మహిమా హ్యేష యేనేదం భ్రామ్యతే జగత్ || 49

యేనేదమావృతం నిత్యం కాలకాలాత్మనా యతః | తేనేరితమిదం కర్మ భూతైస్సహ వివర్తతే || 50

తత్కర్మ భూయశః కృత్వా వినివృత్య చ భూయశః | తత్త్వస్య సహ తత్త్వేన యోగం చాపి సమేత్య వై || 51

అష్టాభిశ్చ త్రిభిశ్చైవ ద్వాభ్యాం చైకేన వా పునః | కాలేనాత్మగుణైశ్చాపి కృత్స్నమేవ జగత్స్వయమ్ || 52

గుణైరారభ్య కర్మాణి స్వభావాదీని యోజయేత్ | తేషామభావే నాశస్స్యాత్కృతస్యాపి చ కర్మణః || 53

ప్రతాపశాలియగు పరమేశ్వరుడు తన మాయను పలువిధములుగా విస్తరింపజేసి, సర్వులను సృష్టించి, శాసించుచున్నాడు. ఆయన మరల ప్రళయములో ఈ వికార సముదాయమును తన అద్వితీయస్వరూపములోనికి ఉపసంహరించుచున్నాడు (44). తాను స్వయంప్రకాశ స్వరూపుడై, దిక్కులను, క్రింద మరియు పైన కూడ ప్రకాశింప జేయు సూర్యుని వలె సర్వమునకు అధీశ్వరుడై యున్నాడు (45). త్రిగుణాత్మకమగు ప్రకృతిని నామరూపాత్మకమగు జగద్రూపముగా పరిణమింపజేసి, తానే భోగ్యమై, తానే భోక్తయై, ఆ జగత్తునకు అధీశ్వరుడై యున్నాడు (46). రహస్యములగు ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడువాడు, హృదయగుహలో నిగూఢముగా నుండువాడు, ప్రకృతికి అతీతుడు, హిరణ్యగర్భునకు తండ్రి, జగత్తునకు కారణము అగు పరంబ్రహ్మను దేవతలు మరియు మహర్షులు తెలియుచున్నారు (47). శుద్ధమగు అంతఃకరణముచే పొందబడువాడు, ఆశ్రయరహితుడని వర్ణింపబడినవాడు, సృష్టి

ప్రళయములను చేయువాడు, కళలను సృష్టించువాడు అగు శివదేవుని ఎవరు తెలియుదురో, వారికి పునర్జన్మ లేదు(48). ఆ పరమేశ్వరుని మహిమ వలననే ఈ జగచ్చక్రము తిరుగుచున్నది. కాని మోహమును పొందిన జనులు జగచ్చక్రము తిరుగుటకు కారణము స్వభావమనియు, కాలమనియు భ్రాంతి పడుచున్నారు (49). మృత్యువునకు మృత్యువు అగు ఆ పరమేశ్వరునిచే ఈ స్వర్గము చుట్టువారబడి యున్నది. ఆయనచే ప్రేరేపించబడిన కర్మనియతి పంచభూతములతో కలిసి జగద్రూపముగా భాసిల్లుచున్నది (వివర్తము) (50). జీవుడు అధికముగా కర్మలను చేసి, వాటి ఫలమును అనుభవించుటకై మరల మరల జన్మించుచుండును. ప్రతి జన్మయొక్క అంతములో దేహమునకు కారణమగు పంచభూతములు మహాభూతములలో కలియుటచే మరణము సంభవించును (51). జీవుడు పంచభూతములు మనోబుద్ధ్యహంకారములు అనే ఎనిమిది తత్త్వములతో గూడి సత్త్వరజస్తమోగుణములకు వశుడై, ఒకే ప్రకృతి ఆశ్రయముగా గలవాడై సుఖదుఃఖములనే రెండు ఫలములను ఆయా కాలములలో అనుభవించుచున్నాడు. పరమేశ్వరుడు తన స్వభావమైన త్రిగుణాత్మకమగు ప్రకృతినుండి సకలజగత్తును స్వయముగా ప్రకటింపజేసి, అజ్ఞానకామకర్మమూలకమగు సంసారమును జీవులకు వారి కర్మలను బట్టి కలిగించును. ఈ త్రిగుణములకు అతీతుడగు జ్ఞాని విషయములో సంచిత (పూర్వజన్మలలో చేసియున్న) కర్మలు పూర్తిగా నాశమును పొందును (52, 53).

కర్మక్షయే పునశ్చాన్యత్తతో యాతి స తత్త్వతః | స ఏవాదిస్స్వయం యోగనిమిత్తం భోక్తృభోగయోః || 54

పరస్త్రి కాలాదకలస్స ఏవ పరమేశ్వరః | సర్వవిత్ త్రిగుణాధీశో బ్రహ్మ సాక్షాత్పరాత్పరః || 55

తం విశ్వరూపమభవం భావనీయం ప్రజాపతిమ్ | దేవదేవం జగత్పూజ్యం స్వచిత్తస్థముపాస్మహే || 56

కాలాదిభిః పరో యస్మాత్ర్ప పంచః పరివర్తతే | ధర్మావహం పాపనుదం భోగేశం విశ్వధామ చ || 57

తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతమ్ |

పతిం పతీనాం పరమం పరస్తాద్విదామ దేవం భువనేశ్వరేశ్వరమ్ || 58

న తస్య విద్యతే కార్యం కారణం చ న విద్యతే | న తత్సమో%ధికశ్చాపి క్వచిజ్జగతి దృశ్యతే || 59

పరాస్య వివిధా శక్తిః శ్రుతౌ స్వాభావికీ శ్రుతా | జ్ఞానం బలం క్రియా చైవ యాభ్యో విశ్వమిదం కృతమ్ || 60

న తస్యాస్తి పతిః కశ్చిన్నైవ లింగం న చేశితా | కారణం కారణానాం చ స తేషామధిపాధిపః || 61

న చాస్య జనితా కశ్చిన్న చ జన్మ కుతశ్చన | న జన్మ హేతవస్తద్వన్మలమాయాదిసంజ్ఞకాః || 62

స ఏకస్సర్వభూతేషు గూఢో వ్యాప్తశ్చ విశ్వతః | సర్వభూతాంతరాత్మా చ ధర్మాధ్యక్షస్స కథ్యతే || 63

సర్వభూతాధివాసశ్చ సాక్షీ చేతా చ నిర్గుణః | ఏకో వశీ నిష్క్రియాణాం బహూనాం వివశాత్మనామ్ || 64

ఒక జన్మను ఆరంభించిన కర్మ క్షయము కాగానే, ఆ జీవుడు మరియొక దేహమును పొందును. భోక్తయగు జీవునకు, భోగ్యము అగు లోకమునకు కర్మ ద్వారా సంబంధమును కలిగించేది జగత్కారణమగు ఆ పరమేశ్వరుడు మాత్రమే (54). భూత భవిష్యద్వర్తమాన కాలములకు అతీతుడు, అంశములు లేనివాడు, సర్వము తెలిసినవాడు త్రిగుణాత్మకమగు ప్రకృతి తన వశములో గలవాడు, సర్వజగత్కారణమగు ప్రకృతికి అతీతుడు అగు ఆ పరమేశ్వరుడే

సాక్షాత్తుగా పరంబ్రహ్మ (55). జగద్రూపముగా నున్నవాడు, పుట్టుక లేని వాడు, ధ్యానించదగినవాడు, ప్రాణికోటికి తండ్రి, జగత్తునకు పూజించదగినవాడు, మా చిత్తములయందున్నవాడు, ధర్మమునకు నిధానము, పాపములను పోగొట్టువాడు, భోగములకు ప్రభువు, జగత్తునకు ఆశ్రయము అగు ఆ దేవదేవుని ఉపాసించుచున్నాము. కాలము మొదలగు వాటికి అతీతుడగు ఆ పరమేశ్వరుని వలన మాత్రమే ఈ జగచ్చక్రము తిరుగుచున్నది (56, 57). లోకపాలాది ప్రభూవులకు కూడ ప్రభువు, దేవతలకు కూడ పరమదైవము, తండ్రులకు తండ్రి, సర్వజగత్కారణమగు ప్రకృతికి అతీతుడు, ప్రకాశస్వరూపుడు, ముల్లోకములలోని ప్రభువులకు కూడ ప్రభువు అగు మహేశ్వరుని తెలియుచున్నాము (58). పరంబ్రహ్మనుండి యథార్థమగు కార్యము ఉద్భవించుట లేదు. ఆయనకు మరియొక కారణము లేదు. ఆయనతో సమానుడు గాని, అధికుడు గాని లోకములో ఎక్కడనైననూ కానవచ్చుట లేదు (59). స్వభావసిద్ధము, సర్వోత్కృష్టము అగు పరమేశ్వరుని శక్తి వివిధరూపములలో ప్రకటమగునని వేదము చెప్పుచున్నది. జ్ఞానము, బలము మరియు క్రియ అనునవి ఆ శక్తియొక్క రూపములే. వాటి వలన మాత్రమే ఈ జగత్తు సృష్టించబడు చున్నది. (60). ఈశ్వరునిపై మరియొక ప్రభువు లేడు. పరంబ్రహ్మకు లింగము (గుణము, లేక స్త్రీ పురుషభేదము) లేదు. పరంబ్రహ్మయందు వాస్తవమగు ఈశ్వరత్వము కూడ లేదు. సర్వకారణములకు కారణమగు పరమేశ్వరుడు ప్రభువులందరికి ప్రభువు (61). ఆయనకు తండ్రి ఎవ్వరూ లేరు. ఆయనకు దేనినుండియు పుట్టుక లేదు. అదే విధముగా కర్మదోషములు, అజ్ఞానము మొదలగు జన్మకారణములు ఏవియు ఆయనకు లేవు (62). అద్వితీయుడగు పరమేశ్వరుడు సర్వమును వ్యాపించి, సర్వప్రాణులలో రహస్యముగా అంతర్యామి రూపముగా దాగియున్నాడు. ఆయన ధర్మమునకు అధ్యక్షుడుని వర్ణించబడుచున్నాడు (63). సర్వప్రాణులకు నివాసస్థానమగు ఆ పరమేశ్వరుడు సర్వప్రాణులలో సాక్షిరూపములో నుండే

చేతనుడు.అనేకులు, అస్వతంత్రులు, స్వయముగా క్రియలను చేయలేని వారు అగు జీవులలో నుండే అద్వితీయుడగు పరమాత్మ నిర్గుణుడు మరియు స్వతంత్రుడు (64).

నిత్యానామప్యసౌ నిత్యశ్చేతనానాం చ చేతనః | ఏకో బహూనాం చాకామః కామానీశః ప్రయచ్ఛతి || 65

సాంఖ్యయోగాధిగమ్యం యత్కారణం జగతః పతిమ్ | జ్ఞాత్వాదేవం పశుః పాశైస్సర్వైరేవ విముచ్యతే || 66

విశ్వకృద్విశ్వవిత్స్వాత్మయోనిజ్ఞః కాలకృద్గుణీ | ప్రధానః క్షేత్రజ్ఞపతిర్గుణ శః పాశమోచకః || 67

బ్రహ్మాణం విదధే పూర్వం వేదాంశ్చోపాదిశత్స్వయమ్ | యో దేవస్తమహం బుద్ధ్వా స్వాత్మబుద్ధిప్రసాదతః || 68

ముముక్షురస్మాత్సంసారాత్ప్ర పద్యే శరణం శివమ్ | నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనమ్ || 69

అమృతస్య పరం సేతుం దగ్ధేంధనమివానలమ్ | యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః || 70

తదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి || 71

తపఃప్రభావాద్దేవస్య ప్రసాదాచ్చ మహర్షయః | ఆత్మాశ్రమోచితజ్ఞానం పవిత్రం పాపనాశనమ్ || 72

వేదాంతే పరమం గుహ్యం పురా కల్పప్రచోదితమ్ | బ్రహ్మణో వదనాల్లబ్ధం మయేదం భాగ్యగౌరవాత్ || 73

నాప్రశాంతాయ దాతవ్యమేతద్ జ్ఞానమనుత్తమమ్ | న పుత్రాయానువృత్తాయ నాశిష్యాయ చ సర్వథా || 74

యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ | తస్మై#్యతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః || 75

అతశ్చ సంక్షేపమిదం శృణుధ్వం శివః పరస్తాత్ర్ప కృతేశ్చ పుంసః |

స సర్గకాలే చ కరోతి సర్వం సంహారకాలే పునరాదదాతి || 76

ఇతి శ్రీ శివమహాపురాణ  వాయవీయసంహితాయాం పూర్వభాగే శివతత్త్వజ్ఞానవర్ణనం నామ షష్ఠో%ధ్యాయః (6).

పరమేశ్వరుడు (ప్రవాహరూపముగా) నిత్యమగు వాటిలో (కూటస్థ) నిత్యుడు; అనేకములగు చేతనములలోని అద్వితీయ చేతనుడు. కోరికలు లేని ఆ ఈశ్వరుడు కోరికలనిచ్చును (65). జ్ఞానయోగముచే పొందదగినవాడు, జగత్తునకు కారణమైనవాడు, జగన్నాథుడు అగు ఆ దేవుని తెలుసుకున్న జీవుడు సంసారబంధములన్నింటినుండి నిశ్చితముగా విముక్తుడగును(66). జగత్తును సృష్టించినవాడు, జగత్తును సాక్షిరూపముగా తెలియువాడు, తన స్వరూపమును తెలిసిన వాడు, కాలమును సృష్టించువాడు, మాయాసంబంధముచే కల్యాణగుణములు కలవాడు, ప్రకృతికి అధిష్ఠానమైనవాడు, జీవులకు ప్రభువు, సత్త్వరజస్తమోగుణములకు అధిష్ఠానము అగు ఆ ఈశ్వరుడు సంసారబంధమునుండి విముక్తిని కలిగించును (67). ఆ దేవుడు సృష్ట్యాదియందు బ్రహ్మను సృష్టించి ఆయనకు స్వయముగా వేదములను ఉపదేశించెను. మోక్షమును కోరు నేను ప్రసన్నమగు నా బుద్ధియొక్క ప్రభావముచే అంశములులేని వాడు, క్రియాసంబంధము లేనివాడు, సర్వనిషేధములకు అవధి, దోషరహితుడు, కర్మలేపము లేనివాడు అగు ఆ శివుని తెలుసుకొని శరణు వేడుచున్నాను (68, 69). మోక్షమునకు సర్వోత్కృష్టమగు సేతువు వంటి వాడు అగు శివుని తెలుసుకొని నేను కట్టెలన్నియు కాలిన తరువాత నిప్పువలె నా స్వరూపమగు శివునిలో నా అహంకారమును ఉపశమింపజేసెదను. మానవులు చర్మమును వలె ఆకాశమును కూడ ధరించ గల్గిననాడు శివుని తెలియకుండగనే దుఃఖము అంతమగును (అనగా, శివుని తెలియకుండగా దుఃఖము అంతము కాదు) (70, 71). ఓ

మహర్షులారా! తపస్సుయొక్క మహిమచే మరియు దేవుని అనుగ్రహముచే మీ ఆశ్రమమునకు తగినది, పవిత్రమైనది, పాపములను నశింపజేయునది, ఉపనిషత్తులలో రహస్యముగా దాగియున్నది, పూర్వకాలములో బోధించబడినది అగు ఈ జ్ఞానమును నేను నా భాగ్యము దొడ్డది అగుట వలన బ్రహ్మగారి నోటినుండి వినియుంటిని (72, 73). సర్వోత్కృష్టమగు ఈ జ్ఞానమును ప్రసన్నమగు మనస్సు లేనివానికి, పుత్రుడే అయిననూ సచ్ఛీలము లేనివానికి, శిష్యుడు కానివానికి ఎట్టి పరిస్థితులలోనైననూ ఈయరాదు (74). ఎవనికైతే పరమేశ్వరునియందు సర్వోత్కృష్టమగు భక్తి ఉండునో, దేవునితో సమానమగు భక్తి గురువుయందు ఉండునో, అట్టి మహాత్మునకు ఇంతవరకు చెప్పబడిన విషయములు చక్కగా అవగాహనకు వచ్చును (75). ఈ పైన సంగ్రహముగా చెప్పెదను . వినుడు. ప్రకృతికి మరియు పురుషునకు కూడ శివుడు అతీతుడై యున్నాడు. ఆయన సృష్టిసమయములో సర్వమును సృష్టించి, ప్రళయకాలములో మరల తనలోనికి ఉపసంహరించును (76).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో శివతత్త్వజ్ఞానమును వర్ణించే ఆరవ అధ్యాయము ముగిసినది (6).